# యువ వాహిని

మనం...

మన సత్సంగ సభ్యుల...

కుటుంబ సభ్యుల కోసం,

"యువ వాహిని...."

"బాల బోధ" (బాలల కోసం) ఎలా ప్రారంభించామో,

అలాగే, "యువ వాహిని" అనే కార్యక్రమాన్ని...

ప్రారంభించ దలిచాము.

16 సం. నుంచి 30 సం.ల లోపు వయస్సు

వున్నటువంటి వాళ్ళకు మాత్రమే!

మన కుటుంబాలలో...

అలా (16-30) ఎవరైనా ఉంటే,

మనకు తెలిసిన వాళ్ళు ఎవరైనా వుంటే,

ఆసక్తి కలిగిన వారు ఎవరైనా వుంటే,

వాళ్ళను ఈ "యువ వాహిని" లో చేర్చవచ్చు.

ఈ "యువ వాహిని"కి సారధ్యం...

మన సుజాత గారు,

అలాగే గుడ్లవల్లేరు రాజశ్రీ గారు,

అలాగే బెంగుళూరు నుంచీ ఉమా శంకర్ గారు,

అలాగే పోర్ట్‌ల్యాండ్ నుంచీ వివేకానంద్ గారు...

సారధ్యం వహిస్తారు.

(16 సం. నుంచీ 30 సం.ల వయస్సులోపల వున్నవాళ్ళకి)

ఇందులో "వేదాంతం" పై ఆసక్తి కలిగి

వున్నటువంటి వాళ్ళు ఎవరైతే ఉన్నారో,

వాళ్ళకి బోధాధికారులు ఎలా బోధించగలరో గమనిద్దాం!!

వాళ్ళకి 'తత్త్వజ్ఞానం' ఎలా అందించాలనే ప్రయత్నం,

ఇది చిరు ప్రయత్నం!!

అందుకని ముందుగా,

'ధర్మాధర్మ విచక్షణ...'

భారతం, భాగవతం, రామాయణం...

అలాగే స్వామి వివేకానంద బోధనలు,

అలాగే భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు

విద్యార్థులకోసం బోధించినటువంటి బోధామృతం...

‘వాహినీ సీరీస్’ అంటారు దానిని!

ఇలాంటి వాటితో,

ఈ 16 సం.ల నుంచీ 30 సం.ల లోపు వయస్సు వున్నటువంటి వారికి,

ప్రాథమికంగా జ్ఞానాన్ని అందించే ప్రయత్నం చేద్దాము.

అవకాశం వున్న వాళ్ళందరినీ,

ఈ “యువ వాహిని” అనే స్రవంతిలో...

చేర్చడానికి ప్రయత్నం చేయండి!!

ఇది మనం దరిదాపు “బాల బోధ” లాగా....

వాళ్ళ (only youth) తో మాత్రమే మాట్లాడుతూ వుంటాము.

ఆ అంశాలు....

‘ధర్మాధర్మ విచక్షణ’,

ప్రతి అంశాన్ని లోతుగా పరిశీలించేటటువంటి,

“ధర్మాధర్మ విచక్షణ ద్వారా... తత్త్వదర్శనం”

అలా...

వారిలో సాధన, సేవ...

– ఈ రెండూ

దాని ద్వారా తత్త్వదర్శనం...

సశక్తమైన కాలమది,

వికసించే కాలమది,

వివేకం కలిగే కాలమది,

ఆ కాలంలో గనుక....

వారిలో సరియైన బీజాలను మనం నాటగలిగితే,

వాళ్ళు ఈ జీవితంలోనే,

ఉత్తమమైన ప్రజ్ఞానాన్ని,

ఉత్తమమైన బోధను,

ఉత్తమమైనటువంటి స్థితిని అందుకుని,

ఆ నిర్ణయంతో శేష జీవితాన్ని,

ఉపయుక్తంగా జీవించగలిగే....

బంధం నుంచీ విడివడటానికి,

ఉపయోగపడే పద్ధతిగా...

ప్రయత్నం చేయవచ్చు.

అలా అందరం కలిసి సమిష్టిగా ప్రయత్నిద్దాము.

హరిః ఓం!!

శ్రీ గురుభ్యోన్నమః

హరిః ఓం!!